# లోకోభిన్నరుచిః

భమిడిపాటి కామేశ్వరరావు

రు 1/-

పబ్లిషర్సు. అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# విషయములు

# బస్తీరోడ్డు

"రోడ్డు" అనేది తెలుగువాళ్లు అప్రయత్నంగా వాడే ఇంగ్లీషుమాటల్లో ఒకటి. ఇంగ్లీషువారు మనకి పల్లీగా తెచ్చి పడేసిన పదార్థాల్లో రోడ్డుకూడా ఉంది. సాధారణంగా శకటాలు కూడా వెళ్లడానికి వీలుండీ, రంగుమీరి ఉన్నప్పుడు మాత్రమే, ఏదేనా మార్గాన్ని రోడ్డు అంటాను. రోడ్డును గురించిన పుస్తకాలు తెలుగులో లేవు. ('నాకు తెలియదు' అనే కబురు చల్లగా చెప్పడానికి 'లేవు' అనేది అలంకారికం.) రోడ్డులాంటి అధమ విషయం గురించి రాస్తే, కావ్యం కూడా నీచం అయిపోవచ్చు కదా అనే ప్రతిచెప్పిన సమర్థులు దాన్ని వొదిలేసి ఉంటారు కాని, ఆ సంగతి తెలియక పోడంవల్ల గావును, అన్యభాషల్లో వాళ్లు రోడ్డు గురించి వందలాదిగా పుస్తకాలు ప్రచురించారు. సామాన్యోపయోగకరంగా ఉండే వృత్తాంతాలు ఎవ్వైనా సరే గ్రంథస్థం అయినప్పుడు పండితులు దుర్ముహూర్తం లేకుండా చూసుకుని క్షమించి పారెయ్యడం మంచిది. నేలబారు రచన మాత్రం చెయ్యగల అస్మదాదులకి 'రోడ్డు' సరిపడ్డ విషయం. ఏమంటే, ఇందులో నేల విడిచి సాం అవసరం లేదు. చాలా పూర్వకాలంలోనే మనుష్యులు నడవడానికీ, గుఱ్ఱపుదళాలు వెళ్లడానికీకూడా, అనేక దేశాల్లో శాశ్వత మార్గాలు ఉండిఉన్నట్టు తెలిసినా, రోడ్డు అనేమాట పుట్టి అట్టేకాలం కాలేదు. ౧౭౩౬ లో

పార్లమెంటుసభకి ఓప్రభువు తనబండిమీద వెళుతూంటేగా, అప్పటి లండన్ బురదవీథుల్లో ఒకచోట ఉన్న ఊబిలో ఆయన బండీయూవత్తూ దిగబడి ఊరుకుందట. ఈరెండువందల ఏళ్లలోనూ, ఇతరదేశాల్లో జనం రోడ్లనిగురించి చేసిన ఆలోచనా, చూపెట్టిన ఆదరణా, సాధించిన అభివృద్ధి మనికి తెలుస్తూన్నప్పుడు, అందరూ రోడ్డుని గురించి దుమ్మురేగేటట్టు ప్రచారంచేసుగుని కాంగ్రెసులు కూడా జరుపుతూన్నప్పుడు, రోడ్డు అనేవిషయాన్ని మనం కొట్టి పారెయ్యడానికి వీల్లేదు — అసలు అనుక్షణం కాళ్లకి చుట్టుగుని ఉండే విషయాన్ని పారెయ్యడం శక్యమూ కాదు, శౌర్యమూ కాదు మరోసంగతి మానవులు కలిసిగాని జీవించలేరు ఒంటరిగా జీవించగలవాళ్ళు ఉండవచ్చు, ఉన్నారు, వాళ్ళు మానవాతీతులు పెద్దస్థలంలో కొంతమంది మాత్రంకలిసి పల్చపల్చగా ఉండేలాగు నివాసం అయిఉంటె దాన్ని గ్రామంఅనిన్నీ, కొద్దిస్థలంలో చాలామందికలిసి ఒత్తిడిగా నివసిస్తే దాన్ని బస్తీఅనిన్నీ అంటారు

ఒకదేశంలో ఈచివరనుంచి ఆచివరకి ఉండే ప్రతిచిన్నస్థలం కూడా కామధేనువు లాంటిదైతే, ఆదేశంలో ఉండుగున్న గ్రామాలసంఖ్య ఎక్కువగాఉంటుంది, ఇంకా గ్రామాలు పుడుతూంటాయి. కాని, ఏదేనాదేశంలో చవిటిపఱ్ఱలూ, ఉప్పుచెరువులూ, ఇసకఎడార్లూ, బోడికొండలూ, గనక విస్తారంగా ఉంటే, జనం ఎక్కడబడితే అక్కడ నివసించడం అసంభవం అయి,

కొత్తగ్రామాలు పుట్టడానికి ఆస్కారంలేక, ఉన్నగ్రామాలే బస్తీలుగా మారడానికి యత్నిస్తాయి. ఈదేశం, వైశాల్యం ధర్మ్యాలన, ఏరకంలోనేనా సరే చేరుతుంది. ఇక్కడ లేని రకం ఉండదు. విస్తారం గ్రామాలూ ఉన్నాయి, కొత్తవి పుట్టుతూనూ ఉన్నాయి కొన్ని బస్తీలుగానూ మారుతూన్నాయి స్థూలంగా చెప్పాలంటే, జనాభా ఒక పాతిక వేలకి పెగ్గిరపడినా, లేక ఎంత వంకరటింకరదైనాసరే ఒక కంకర రోడ్డు దాంట్లోకి చొరబడినా, గ్రామంఅనేది బస్తీగా ముసురుతుంది. ఒక బస్తీనించి ఇంకోబస్తీ చేరుకోడానికికూడా ఘంటాపథాలు ఉంటాయి. ప్రస్తుతం వాటిసంగతి కాదు. ఒకేబస్తీలో ఉండేజనం, తమతమ వ్యవహారం సందర్భాలు చూసుకోవలసి, అవసరం వచ్చినప్పుడు ఒక గృహందగ్గిర్నుంచి మరో గృహానికి వెళ్ళాలి. ఈరీతిగా మోషాజనం తప్పకడం అందరూ వెళుతూంటారు. అందుచేత, ఇళ్ళమధ్య పిల్లైనంత ఖాళీస్థలం అశేషజనం ఉమ్మడిగా వాడుకోడానికి కేటాయించి ఉంటుంది. అటువంటి బస్తీవీథిరోడ్ల సంగతి కొంచెం ముచ్చటించడమే ఇప్పుడు సంకల్పం.

రోడ్డు అనేపదార్థం మాయిమంత్రంవల్ల చిటగిలో తయారయే బాపతు కాదు. దానికి చెప్పుకున్నన్ని పూర్వాంతరాలున్నాయి. వాటిని జన్మాంతరాలనాన్న ప్రత్యవాయమున్న లేదు. అసలు దుర్గమస్థలంలో మొట్టమొదట కాలు పెట్టినవాడు సాహసుడయి ఉంటాడు. వాడిఉద్దేశం వాడికే తెలిసిఉంటుంది.

జాంశలో పెట్టిపుట్టింది అయిఉండాలి, అనగా, ఆవీధులో కాపరంఉండే ప్రతీద్విపదుడూ మామూలు మనిషై ఊరు కోక, చివరకి ఏఒకడైనా బస్తీపాలకసంఘంలో ఒకసభ్యుడై ఉండాలి రోడ్డులేనప్పుడు అతనికి ఉండే బాకా మర్యాదల్లో ఎవరికీఉండకూడదుట లేకపోతే, అక్కడ కాపరంఉన్నవాళ్లల్లో ఒకడైనా ప్రభుత్వంవారి పరిచయుడైనా కావాలి, లేక ధనవంతుడైనా కావాలి, నిలువుగా చీరేవాడో, అడ్డంగా గాదేవాడో, లేక తెగతిట్టేవాడో, తెగ ఆశ్రయించేవాడో కావాలి. అదీకాకపోతే, ఒక గవర్నరు గాని అతనిలాంటి గొప్పమనిషిగాని ఆ వీధివెంట వెడతాడని తెలియాలి! ఆయన ఇక ఏపోయెట్లుంటో ఆ గొప్ప వెడతాడని తెలియడంతోనే, అతని సహాయుల్ల, రాముపాదధూళి తగిలింతరవాత రాయి మనిషైనట్టు ఆయన పాదంచెప్పులో ఉండడంవలనించి తత్పదధూళికైనా నోచుకోనైతిని గనాలని చెప్పేసి ఆదారి రాయిలా అయిపోతుంది. అది అట్లా అయిపోయేటప్పుడు ఇంతలోటి విద్యార్థ్యాలకేసి శస్త్రీ ప్రాయి కట్టు కుమ్మజనంలాగ నెల్లవేసుగున్న ముసుగుతూయిలు వెల్ల తెల్లపోతూ చూస్తూంటాయి అదే అదను, వాళ్లిదారి నను, అవి కొన్నిదార్లు అప్పుడు కంకరకూడా అవుతాయి. పురపాలక సంఘంలో అందరూ కంకర రవాపోపడంవల్ల, కొన్ని దార్లు ఎన్నటికీ కంకర రవనే అవవు. ఒకొక్కప్పుడు కంకర వగైరా తెచ్చి, నడవడానికికూడా వీలులేకుండా ఎడాపెడా పొయ్యడం సమేతూ జరిగిపోతోంది. అప్పుడొస్తుంది ఎగే

రిస్తుంది. సాధారణంగా గుంటతవ్వి, మరీ పెద్దగోతులుంటే వాటిల్లో పెద్ద రాయెట్టి, చిన్నసైజు కోసురాయి సర్ది, ఎర్రకంకరో తెల్లకంకరో చిమ్మి, ఇసకపోసి, నీళ్ళుచల్లి చేసేపద్ధతి అవలంబిస్తారు. (మహాబస్తీల విషయంలో, వాటి హోదానిబట్టి పలకరాతివీ, సిమెంటువీ, తారువీ, కంకరవీ రోడ్లు వెలుస్తాయి వాటి ప్రమేయంకాదిప్పుడు.) రోజు గడవనివాళ్ళూ, జీవితం గడవనివాళ్ళూ వచ్చి తక్కినప్రపంచం నడిచిపోయే నిమిత్తం నెనుటతో రోడ్లు వేస్తారు. కాని, ఎంతెంతటి శ్రమలుపడి వీటిని సృష్టిచేసినా, వీటిల్లోవీటికి బొత్తిగా జాత్యభిమానంలేదు, సోదరభావం లేదు.

వీటియొక్క రకాలకు హద్దులేదు చాలా రకాలు మా ఊళ్ళోనే దొరుకుతాయని ప్రతీఊరి ప్రతీవాడూ విర్రవీగుతాము, ఎవడిమాట నిజమో తేలకుండా. కొన్ని కేవలం గజం పన్నా రోడ్లు. తెలుగు లిపిలో తలకట్లు మూలబడడంచేత గజం అంటే ఏనుగు అనుకోగలరు. కాని ఇక్కడి అభిప్రాయం "గజం" అనగా మూడడుగులు నేల — అయినా మళ్ళీ వామనుడు కోరినంత సైజుని కాదు! కొన్నిరోడ్లు మనిషి పన్నా — ఆ మనిషైనా భారీకాయం అయితే కొంచెంపడక నడిస్తేగాని అతనికి జరుగుబాటుండదు. కొన్నింటికి వక్రభావమేకాని ముక్కుకి సూటిగా పోదామని లేనేలేదు. ఈ సంగతే దొరకపుచ్చుకుని, చుట్టుప్రక్కల దొరకగల వక్రత్వం యావత్తూ తమ ఊరిరోడ్లె గుత్తకి తీసుకున్నాయనిన్నీ, అందులో మరేమీ

వాటా మిగలక పోడాన్నించి తమ ఊరి జనం అశేషం ఋజుమార్గవర్తులయి తీరవలిసొచ్చిందనిన్నీ, ఒకొక్క బస్తీ కవి బడాయి కొడుతూంటాడు. నాగరికత ఎరగని రోజులుగనక పూర్వం 'సూత్రపట్టినట్లు' ఒక బస్తీవీథులు ఉండేవిట! ఇతర బస్తీలల్లో రోడ్లు దిక్కుమాలిన రోడ్లనిన్నీ తన ఊళ్ళోవి దిక్కున్నవనిన్నీ ఒక నగరప్రియుడు ఒకచోట ఒకపేచీ లేవదీశాడు. ఎంచేత అని అడిగేసరికి, 'దక్షిణముకు మాత్రము బండ్లుపోవాలి పడమరకు మాత్రము జంతువులు కదలాలి' అని దిక్కు తెలుపుతూండే రోడ్లు తన ఊళ్ళోగాని లేవని అనుసంధించి నెగ్గుకుపోయాడు. కొందరు మనుష్యులకిమెట్లే కాకుండా, కొన్ని రోడ్లు ఉచ్చనీచాలు గల ఘటాలు. అందుకని వాట్లమీదికి ఏ దేనా బండీ వచ్చినప్పుడు, ఆరోడ్లు అంబోతుల్లాగ కోరమూపులు చూపి ఒడుపు కనిపెట్టి, ఆ బండీని బోల్తాకొట్టిస్తాయి ఒకవేళ ఏనుగుపాటుగా నడుస్తూండే మనుష్యులు గనక వచ్చారా, వాళ్ళ కాళ్ళూ చేతులూ అధమం నడుమూ విరిచేస్తాయి కొన్ని చుట్ నిర్మోహమాటపు రోడ్లు మరీ హెచ్చుతగ్గుగా వ్యవహరించడం వల్ల ఒళ్ళల్లో జనం కొయ్యయిపోతూంటారు. 'అచేతనంబులు చేతనరీతి దనర, చేతనంబులచేతనభాతి నొనర' వీణ వాయింపు ఉన్నదని, ఒకకవి అన్నాడు. నేడుకూడా చాలా పాటకచేరీలూ, కొన్ని రోడ్లమీద ప్రయాణాలూ అంతటివీ ఉన్నాయని మనం గర్వపడవచ్చును. కొన్నిరోడ్లుగల వీథుల్లో

కాపరంచేస్తే, ఎండాకాల వానకాలాల తేడాలు తెలియకుండా పోతాయనిన్నీ, రోడ్లే కాలవలుగా మారడంచేత, 'ఓడలు బండ్లవచ్చు బండ్లోడలవచ్చు' అనే మాటల్లో ఉండే సంశయత్వం పోతుందనిన్నీ కొందరన్నారు. కొన్నిరోడ్లమీద, మధ్యగా, మురుగు పోయేనిమిత్తం, ఒక్కగాడి ఉంటుంది. రోడ్డు దేవిగారి పాపిడికాటుగదా అన్నట్టుగా మంచు వేసవిలోకూడా రోడ్డు మధ్యగా ప్రవహించే శక్తిగల మురుగుకాలవన్ని ధరించిన రోడ్లున్నాయి. వీటిని చూచినప్పుడు, పర్వతాల్లో పుట్టి మంచుకరగడంవల్ల వేసవిలో ఎక్కువ నీటితో ప్రవహించే నదులు జ్ఞాపకంవస్తాయి. ఎటొచ్చీ, నీటిలో నీరు ఘనీభవించిన కుళ్ళులో సమపాళంగా మిళితమై గుల్లగా ఉండి 'కృష్ణ' స్మరణ చేయిస్తుంది. ఒకొక్క గ్రీష్మంలో ఉష్ణకాల్లో ధళుపుగంగులోనే కాకుండా అసత్తైన కంపులోకూడా అద్వితీయమైన ఒప్పేటటువంటి కొన్నికొన్ని మైనుకాలవలకి విహారాది విషయాల్లో సక్రమమైన ట్రైనింగు ఇచ్చి, వాటిల్లోఉండే నీటిమహాత్యం అనుభవించకపోడంచేత పౌరులు చెడిపోతారేమో అనే బెంగ చొప్పున, అవి మరోచోటికీ మరోచోటికీ తమ యిష్టంవచ్చినట్లు లేచిపోకుండా, తమ ఆజ్ఞానుసారం, చేరువనున్న మంచినీటికాలవల్లో కలిసేలాగచేసి, జనం శ్రమించి ఆట్టే దూరాభారం వెళ్ళక్కర్లేకుండానే ఆ 'గంగాయమునా సంగమపుణ్యాదర్శనఫలం' జనానికి పన్నులేకుండానే మంజూరు చేసి, ఆజనం అల్లాంటి పుణ్యాన్నిపొంది జీవన్ముక్తులవడానికి

నానాతిప్పలూ పడుతూంటారు. కొన్నిరోడ్లు తమాషాగా కనిపించి, కొత్తవాణ్ణి బెదిరిస్తాయి. దాంతోటి ఆకొత్తవాడు అనుమానిస్తూ నడుస్తాడు. అవి వాణ్ణి తిప్పి తిప్పి చివరకి ఎవరియింట్లోకేనా లాక్కుపోతాయో, లేక వీథులో పడేస్తాయో వాడికి తెలియదు.

బస్తీరోడ్డుయొక్క ప్రత్యేక విశేషం అయిన దుమ్ము గురించినది పెద్దఘట్టం. దుమ్ము నిరంతరంగా బస్తీలో విజృంభిస్తూ ఉంటుంది. బస్తీపాలకులు దాంతో యుద్ధంచేస్తాంటారు. వారు ఇతరవిషయం ఏదేనాసరే దుమ్ముతెగకొట్టగలరుగాని విషయమే దుమ్మై అదే తెగిపోయే దయినప్పుడు, ఏమీ చెయ్యలేకపోతూంటారు. అసలు దుమ్ము లేకుండా చేస్తే సరి, ఇహా నెల్లా రేగుతుంది దాని మొహం! అని, కొందరు సలహా ఇస్తారు. అందుకని, కొన్నిచోట్ల బస్తీరోడ్లు ఇళ్లూ వాకిళ్లూ తుడిచినట్లుగానే చీపుళ్ళతో గంటలో తుడిచేస్తారు. దానిఫలితం ఏమిటా అంటే ఇరవైనాలుగు గంటల్లో చుట్టుప్రక్కల గృహవృక్షాదులమీద మలామా చెయించినట్లు సర్దుకునే దుమ్ము ఒకగంటలోనే గబగబా సర్దుకుంటుంది. ఈ పద్ధతిలో పథికులకంటె సమీప గృహస్థులకే ఎక్కువపాలు దుమ్ము కిట్టుతుంది. కొన్నిచోట్ల రోడ్లు కూలీలచేతా, కొన్నిచోట్ల కార్లచేతా, తడిపిస్తారు. మొదటి పద్ధతి చాలమంది బీదవాళ్ళకి పని చెబుతుంది గనక, అంతమందికి జలక్రీడోద్యోగం ఇవ్వడం ఏమిటని చాలా బస్తీల్లో అది మానేశారు. ఒక్క

యంత్రప్రధానంవల్ల వెయ్యిమంది పనివాళ్ళు మూలపడతారు. అంచేత గావును బస్తీలో నీళ్ళకారు! దానికి చెయ్యబడిఉండే ఏర్పాటు మూలాన్ని జౌతుఖానాలోంచిలాగ నీరు ఇటూ అటూ చటుక్కున చిమ్మచ్చు, చటుక్కున ఆపచ్చు. ఆ అధికారం సాధారణంగా డ్రైవరు చేతిలో ఉంటుంది. కాని, ఆయంత్రం అతన్నికూడా దగాచేసి, తనఖులానా చొప్పున పోతూండడం కూడా కద్దు. డ్రైవరు ఉద్యోగానికి కారకుడైనవా రెవరైనా పక్కనించి పోతూంటే, అది చటుక్కున ఆగిపోతుంది. కాని, ఇతరబస్తీజనులుగాని, ఇతర గ్రామస్థులుగాని, స్త్రీలుగాని అయితే, పెద్ద-పిన్న ముసలి-పడుచు తారతమ్యం గమనించకుండా నీరు చిమ్మేస్తుంది. అందుకని, ఏకొద్దిమందో తప్ప తక్కినవారు నీటికారు ఎప్పుడు తననీటితుళ్ళు విప్పుతుందో - ఏదుబందిలాగ - అని భయం చొప్పున దూరాన్నించే జాగ్రత్త పడతారు. రోడ్డు తడపడం దుమ్ముని అణచడానికి. అప్పట్లో ఆపని నెరవేరినట్లు కనిపిస్తుంది. కాని, తడిసిన దుమ్ముమీంచి శకటాదులు వెళ్ళడం వల్ల తొక్కిడికి వస్త్రకాళితం చేసినట్లు మరీ కాటిగలా అయి, ఎండొచ్చి తడి యిగిరింతరవాత, పూర్వం తాడిప్రమాణాన్ని లేచే, ఆ సాయంత్రానికి తారాజువ్వలా లేచి, తలపెట్టిన ఉద్దేశానికి విరుద్ధం ఫలించేటట్టు చేస్తుంది. ఇదిగాక, అలవాటుగా నీళ్ళు పోసేసరికి, రోడ్డుమీంది మెరకపల్లాలు ఖాయపడి, సంవత్సరంలో బయల్దేరే కతకలు నెలలోనే సిద్ధిస్తాయి.

వెనక వేపున రోడ్డుబురద చిలకరింపు సంక్రమిస్తుంది. కేవలం స్లిప్పర్లు తొడుక్కొని రప్పు రప్పున నడిచేవాళ్ళకి, బాడి చిందులు బాగా చిమ్ముబట్టి రవ్వల్లాగ లేచి నెత్తిదాకా వ్యాపించి యజమానికిచ్చే శక్తిని అందరికీ కనిపిస్తాయి. కాని గోడ్లమీద మొత్తానికి, కార్తీకలాంటి అడుసులా తయారై, జనసంచారానికి పట్టుగోడంలో, ప్రేమలో ఉండే స్త్రీ పురుషాదులు బస్తీవారాణి రాయించుకొని (పిలవని!) పేరంటానికి వెళుతూన్నట్టు తెలుస్తుంది. ఒక్కొక్కచోట, ఇళ్లలోంచి ఇవతలకి, ఇవతలనుంచి ఇంట్లోకీ వెళ్ళపడడం అనేది క్రతువులాంటిపని అయిపోతూండడంచేత, అక్కడి యజమానులు తప్పనిసరి అయినప్పుడు తప్ప కొంపలోనే పడుండి, యథాశక్తి దేశాభిమానం అని చెప్పదగిన గృహాభిమానం నేర్చుకుంటూంటారు.

బస్తీరోడ్లవల్ల ప్రయోజనాలు ఒక్కమాటు చూసి పట్టెయ్యవచ్చు. రాత్రిభాగంలో కొందరు వయస్సొచ్చిన స్త్రీ పురుషులు తమయింటి ఎదరకాని రోడ్డుని బాహ్యానికి ఉపయోగించి ఆపని నెరవేర్చి రావడంలో తమరు ప్రకటించగలిగిన ధైర్య సాహసాలకీ తెలివితేటలకీ అభినందించుకునే వాళ్ళూ, తమ యింట్లో ఉండేజనంచేత మన్ననలూ స్తోత్రాలూ పొందే వాళ్ళూ ఉన్నారు. కొందరికి ఇంటి ఎదటిరోడ్డే తమకున్న ఖాళీస్థలం అవడంచేత స్నానాలూ తలంట్లూ రోడ్డుమీదే. భోజనాలకి, కజ్జాలకి, పురుళ్ళకి, పురాణ్యాలకి, ఓకేమిటి సమస్తానికీ

కొందరిపట్ల రోడ్డే ఆధారం. ఎండపెట్టుకోడాలన్నీ రోడ్డుమీదే. కొందరు పశువుల్ని పెంచడం, కట్టెయ్యడం — అంతా రోడ్డుమీదే. కొందరు తమయింటి ఎదటిరోడ్డుమీద తమహక్కు స్థాపించుకోడానికే తమసొంతరోడ్డుమీద కలాపు చల్లి ముగ్గెయ్యడం ఇతరులెవరూ దొంగతనంగానేనా పట్టుకెళ్ళరుగదా అనే ధైర్యం కలిగించే వస్తువులన్నీ కొందరు రోడ్డుమీదే దాచుకోడం. కొన్నిరోడ్లమీద రాత్రిళ్ళు ఎడాపెడా పడే వేసంకాలపు మంచాలమధ్య కుక్కలుండీ, దారెంట వెళ్లవలసినవాళ్లు కాలెట్టడానికి అవకాశం ఉండదు. చాలా బస్తీరోడ్లమీద ఇటీవల బయల్దేరిన సోడాకొట్లవల్ల దారి మూసుకుపోతోంది — [illegible] తెంకాయిలాగ. ఈ కొట్లు దేవదారువీ, కర్రవీ, క్రమేపి ఇనపవీకూడా అవుతున్నాయి. రోడ్డు ఎంత యిరుకుదైనాసరే, రథంలాంటి సోడాకొట్టు, పాలకసంఘానికి ఫీజు కట్టేసి, అక్కడే వేనూ ఇరుకుతుంది. ఒకటి పుట్టేసరికి దినా దినాభివృద్ధిగా పిల్లల్ని పెడుతుంది. వీటిల్లో వంటకీ, భోజనానికీ, పడకకీ, విశ్రాంతికీ — అంతస్తులూ, బిలాలూ రహస్యమార్గాలూ అన్నీ దుర్గానికి ఉన్నట్టు ఉంటాయి. వీటికి కిందచక్రాలు పెట్టేస్తున్నారు కొందరు, కొండలకిరెక్కలు పురమాయించినట్టు. ఈదెబ్బతో బస్తీకి రథాలులేని అపకీర్తిపోయేట్టు కనిపిస్తుంది.

అయితే, రోడ్డుగురించి ప్రథమసూత్రం ఏమిటంటే, గమనం కలిగిన జంతువులే కాకుండా చలనంగలిగిన పదార్థాలుకూడా

గోష్ఠుని వాడుకోడానికి హక్కుగలవే, అని. కాని, ఎవరైనా సరే, వీళ్లైనంత త్వరలో వాడుకొని ఇతరుల వాడకానికి దానిని వదిలేస్తూండాలి అందుచేత, ఎంత తక్కువ కాలంలో దానిని వాడుకొని వదిలెయ్య గలవాడైతే, అంత వెంకరాత్రే అది వాడుకోడానికి వాడికి మొదటిహక్కు ఏర్పడుతుంది. ఆ మొదటిహక్కులో ఉండే నియమం గమనించి పేచీలు రాకుండా గమనాలు నడిపించడం నిమిత్తమే కూడలి వీధుల దగ్గిరా, మలుపులదగ్గిరా, పోలీసుసోదరులు ఖణాయించి చేతులు — (అవి మీసాలుసర్దుకోడంలాంటి ఇతరపన్లో లేనప్పుడు) — తిప్పుతూండడం. ఈహక్కు పుణ్యమాఅనే, ప్రపంచప్పు గొప్ప బస్తీలలో ప్రమాదాలు జరిగి రోజుకి సగటున నలుగురు మొదలు [illegible] మనుష్యులు ఖచ్చుపడుతూ ఉండడం. పోనీ, హక్కుమాట సరేగాని మరి బాధ్యత ఎవరిదీ? అంటే, ఆమాట అంటునే చాలమందికి కోపం! పైగా అది వేరే సంగతి!!



# అయోమార్గం - అభినందనం

రైలుయొక్క మార్గం అయోమార్గం అయినా, దాని యొక్క వ్యాపారంలో కొంత స్వార్థత్వం, కొంత హడావిడిగుణం, కొంత కర్రపెడితనం ఉన్నా, అది అస్పృష్టపదార్థోపేతం అయిన గాంధాభినయంలాగ, శుద్ధఅయోమయం కాదు. దాని సంగతి ఏకొంచెం అందరికీ తెలుసు. ఆవిరి, విద్యుత్తు, అణుస్ఫోటం వగైరాల శక్తులవల్ల దానికి గమనం సిద్ధిస్తుందనీ, దాన్లో భూమిని పట్టుకుపాకేరకం - భూగర్భం తొలుచుకుపోయేటట్టు నిర్మించబడ్డ కొట్టాలలో చరించేరకం - భూమికి కొంత ఎత్తున స్తంభాలమీద వెళ్ళేరకం - ఒకేపట్టామీద పోగలరకం - పట్టాలున్నా వాటిని తాకకుండా నడవగలరకం - వగైరా ఉన్నాయనీ, దాని శాఖలు కొన్ని ప్రభుత్వాల కిందా, కొన్ని రాష్ట్రాల అధీనంలోనూ - కొన్ని పెట్టుబడిసంస్థలైన కంపెనీల చేతుల్లోనూ - ఉన్నాయనీ, ఎరుగున్నవిషయాలే! గమనానికి పట్టాలుండడం ప్రతిబంధకం అని కొందరు భావిస్తారు. స్థిరమార్గం సర్ణితం అయిఉండడం అనేది వేగాంతరసిద్ధికి దోహదకరం అని కొందరు నమ్ముతారు. మొట్టమొదట్లో రైలుపట్టాలు భూమండలంమీద పడి ఇప్పటికి నూరేళ్ళూ నిండ పుష్కరం దాటింది. ఆ భాగ్యం పొందిన పుణ్యస్థలం సీమదేశమే. ఆ స్థలంలో రైల్వేశతాబ్దోత్సవం జయప్రదంగా జరపాలని (వార్తాపత్రికారచనలో జయప్రదంకాని సంభవమే ఉండదు!) ప్రయ

త్నాలు చేశారని చెప్పాగుంటారు. ఇండియాలో రైల్వేసహా ప్రవహాసోత్సవం పెట్టించాలని చాలాముందే తంటాలు పడ్డట్టు తెలుస్తోంది. దరిఅంచూ తెలియని మహాకాలంలో సంస్థల గొప్ప పర్వోత్సవాలు జరపడంలో తిథివారనక్షత్రాలతో సహా అసలుదినం గమనించక్కర్లేదనే విశాల భావంతో కొందరు, వీలునిబట్టి వాటిని పెట్టించడాలు ఎరుగుదుం. మంచి ముహూర్త సందర్భం సంఘటించినపుడు దాన్ని నాట పెట్టు గోడంలోఉండే బాధనిబట్టీ, గొప్పవ్యక్తి తంతట తనే వచ్చినప్పుడు ఖర్చులేకుండా అతణ్ణి అధ్యక్షుణ్ణి చేసుగోడంలో ఉండే సంతోషాన్ని బట్టీ, ఒక్కొక్క వ్యక్తి తను కార్యకర్తగా ఉండగా వీలైనంత గొప్పతనంగా సమావేశం జరగాలిగాని కడంవాళ్ళహయాంలో కాకూడదనే పట్టుదలలు బట్టీ, సంస్థల ఉత్సవదినాలు ముందుకీ వెనక్కీ జరుగుతూంటాయి. రైల్వే విషయంలో మరీ వీళ్ళున్నాయి. పైచెప్పిన రెండు ఉత్సవాల లోనూ ఏ ఒకటికూడా లోగడ జరిగి ఉండకపోయినప్పటికీ — వాటిల్లో ఏదో ఒకటి, ఏదో దేశంలో ఇకముందు ఎప్పుడో అప్పుడు ఎవరో కొందరు జరిగించినా బాధ లేదంటున్నారు. ఎందుకంటే, ముందు ఒకగొప్ప ఉత్సవం చేసిచ్చేసి తదుపరి వెనక్కి తిరిగి లెఖ్ఖచూసినా, ఆదినం రైల్వే సంస్థకి చెందిన ఒక గొప్పవిషయం ఒక గొప్పదేశంలో జరిగిన పర్వదినం అయి ఉండి తీరుతుంది. ఇది గాక, అయోమార్గం యావద్భూభాతలానికీ చెందినదే గనక, భూప్రజలంతా కలసి దాని తాలూకు

వాడుగాని, బెర్లిన్ జులుందారువంటివాడుగాని నియంత ఒకడు వున్నట్టాయినా, అతణ్ణే అధ్యక్షపదవికి ఆహ్వానిస్తే తీరి పోతుందని సలహా యిస్తున్నారు కాని అలాంటివాణ్ణి యీభూమిమీద అడుగెట్టనిస్తే, అతడు తన్నో, తిట్టో, బెదిరించో లాగేసి యీభూమి మావత్తూ చివరకు తనదే అనడంగాని లేక తనవాళ్ళందర్నీ ఇక్కడ ఉద్యోగాలకి సిఫార్సుచెయ్యడంగాని మొదలు పెడతాడేమో, అని కొందరు బాధపడుతున్నారు అంగారక గ్రహంలోంచి కాకుండా మరోగ్రహం దేన్లోంచేనా అధ్యక్షుణ్ణి పిలిస్తే గగనంలో "గజ్మన్" అనే అమోఘ వాగ్దత్తం చెయ్యాడి నేటి వరకూ ఎవరిచేతా పొందబడకుండా నిల్చిపోయి ఉన్న వెయ్యి పౌనుల బహుమతీకూడా, దక్కులుపడుతుంది కదా అని కొందరు అంటున్నారు ఏమయినా మహాసభాధ్యక్షుడు - ఆహ్వాన సంఘాధ్యక్షుడు - అన్నట్టు, జాగేస్థలం వగైరాలు ముందుముందు స్థిరపడవలసిఉన్నా, ప్రస్తుతం తెలుగుదేశపు వివిధకార్యకర్తలకి కాబోయే సభనిమిత్తం జనంచేత యథావిధిగా పంపబడ్డ చిత్తు అభినందనతీర్మానాలు కొన్ని తెలిసిరావడంవల్ల, అవిపరీతిగా ఉండగలవో చూడడానికి వీలు దొరికింది. అవి ఈక్రింది విధంగా ఉన్నాయి:

నరాలవల శరీరంలో వ్యాపించిఉన్నట్టు, ఇప్పటికే ప్రతీ దేశంలోనూ రైలుపట్టాలు వ్యాపించి ఉన్నా, ఇప్పటికీ "మొయిలు వెళ్ళిపోయింది గావును, నేను చూడా లనుకున్న

ప్లాటుఫారంగార్ని చూణ్ణేలేదు!", "నల్లటి మొహ్లకి గంతలు కట్టి రైళ్ళు లాగిస్తారు" "ఒకొక్క బూశ్సుబండికి రొండేసి తలకాయ లుంటాయి!" "మావూరికి పిక్కంటిమ్మంటే ఎక్కడికో సెప్పమంటాడేటి? నావూ సీడికెంచుకన్నాను!", "ఏడూరికి టికట్టిమ్మన్నా, ఒకేదగ్గర దాన్ని నొక్కి టిక్కుమనిపిస్తాడే!" అని అంటూండే జనంగురించి ఈ సభవారు చాలా దుఃఖిస్తూ వీళ్లు ఒకప్రత్యేక తీర్మానగౌరవం పొందడానికి అనర్హులని నిర్ధరించి, జాలిపడుతున్నారు. —

ఏకో దేశానికి చెంది, కోటీశ్వరులై, ప్రభుత్వబలం యొక్క ఆసరా చూసుగుని స్వాధీన దేశాల్లో ఉండే గృహారామక్షేత్రాములు బలత్కారంగా కొని, వాటిని శూన్య స్థలాలుగా చేసి, ఇనపపట్టాల సంకెళ్ళతో ఆస్థలాన్ని కట్టేసి తద్వారా రసయోగం తెలియకుండానే తమ ఇనుమును బంగారంగా మార్చుకో గలిగిన రైల్వేసంఘాల్ని ఈసభవారు కొనియాడుతున్నారు. —

ఒకొక్కక్క వ్యక్తిచేతుల్లో రూపాయిపడిందంటే బొగ్గుగా మారిపోడం మామూలు గనక, జనబాహుళ్యం విడివ్యక్తులలో నమ్మకం ఉంచరని గ్రహించి, సంఘాన్ని నమ్మించడానికి సంఘమే ఉండాలని తెలుసుకుని సంఘాలుగా ఏర్పడి, బొగ్గుని రూపాయిలుగా మార్చుకో గలిగిన రైల్వేబుద్ధిశంతుల్ని ఈ సభవారు మెచ్చుకుంటున్నారు. —

పెట్టుబడులకీ ధరలకీ సంబంధం ఏముటో జనానికి తెలియు

రాకుండా అట్టేపెట్టి, రుచి కలిగేవరకూ ధరలు తక్కువగా ఉంచి, అలవాటు స్థిరపడడంతోటే ధరలు క్రమక్రమంగా పెంచేస్తూ, పోటీకోసం సబబులేని తగ్గింపులు చేస్తూ, లాభాలు పుచ్చుకునే వాళ్లు ఎక్కడుంటారో కనబడకుండా వ్యాపారం చేయిస్తూ ఉన్న రైల్వేప్రజ్ఞావంతుల్ని ఈసభవారు పొగుడుతున్నారు. —

అయోమార్గాలు మామూలుగా జనోపయోగ నిమిత్తం అని పైకికనపడ్డా యుద్ధంలాంటి అవసరం వచ్చినపుడు స్వలాభం కోసమే అని ఎరిగుండి వ్యవహరించే రైల్వేపెద్దలికి ఈసభవారు నమస్కరిస్తున్నారు. —

వర్ణాశ్రమ ధర్మాలవంటి తారతమ్యాలు మనుష్యుల్లో కూడునా, రక్తాల్లో తేడాలుంటాయి గనకనా, అంతా ఒకటే అనేటంత సర్వసమత్వం తెలిసిన జాతికి చెందినప్పటికీ, అయోమార్గంలో మొదటిక్లాసు, రెండోక్లాసు, మూడోక్లాసు అంటూ తరతమభావం పెట్టిన రైల్వేసంఘాలవారి వివేచనా శక్తికి ఈసభవారు ముక్కుమీద వేలేసుగుంటున్నారు. —

పెద్దబస్తీలలో, ముందు ఊరవతల ఒకస్టేషనూ తరవాత నాలిక కరుచుకుని ఊళ్లో ఒకస్టేషనూ వేసి, ఊళ్లోదానివల్ల వచ్చే డబ్బు పట్టగెల్లి ఊరవతలదాన్ని పెంచి, ఊళ్ళోదాన్ని పిల్లైనంత ఇరుకుగానూ ఏహ్యంగానూ ఉంచినందుకు, ఈసభవారు రైల్వేఅధికారుల్ని ఏమనాలో తెలియకుండా ఉన్నారు. -

నాలుగేసి వందలమంది ఒకొక్కరైలుకి ఎక్కే స్టేషన్లలో

జనం విశ్రాంతి తీసుగోడానికి నాలుగైదు బెంచీలు సప్లయిచేసి యథాశక్తి ఏర్పాట్లు చేసిన రైల్వే అధికారుల్ని ఈసభవారు శ్లాఘిస్తున్నారు. —

ప్రతీ ప్రయాణీకులబండీ బయలుదేరడానికి రెండుగంటల పూర్వమే టిక్కెట్లకిటికీ తెరిచి ఉంచుతున్నాం అనే రాతతో కిటికీకంతు పెద్దబల్ల కట్టి అక్కడ పేర్కొనబడ్డ గంట ఒకటికి నిమిషాలు రెండుమాత్రమే అనే పగా రాయడం మరిచి పోయిన రైల్వే అధికారుల్ని ఈసభవారు వహవ్వా అంటున్నారు —

రైల్వే ఉద్యోగాలకి జీతాలు తక్కువ అయినప్పటికీ కొన్ని వందల చేతిసొమ్ము అయినాసరే రవంత ఉద్యోగం రైల్వేలో దొరికితే చాలు అనేటంత ఆదాయం ప్రతీ రైల్వే ఉద్యోగస్థుడికీ ఉంటుంది అనేభావం - భ్రమ ! — జనంలో కలిగించిన రైల్వే యజమాన్లకి ఈసభవారు హారతి యిస్తున్నారు. —

క్రింది రైల్వే అల్పోద్యోగిలగాయితు పైమెట్టు ఉద్యోగి వరకూ అధికార్లిచ్చేజీతం తాకీదుప్రకారం పుచ్చుగుంటూ, అందుకు అదనంగా, జనం — తమపన్లు అర్జెంటుగా లాభకరంగా నెరవేరినందుకు — సంతోషించి యిచ్చే ధన కనక వస్తువాహనాలు తప్ప, తక్కిన మరి ఏయితరమైన లంచాలూ కానుకలూ స్వీకరించకుండా కట్టుదిట్టాలు చేసిన రైల్వే కారకుల్ని, ఈసభవారు ఘనత పరుస్తున్నారు. —

రైల్వే పాలకులు తమపరిపాలనలో, ధనాధికార పైత్యవిశే

పాలు గాని, వాగ్ధాటిగాని, కూరగాయలు - వస్తువులు — ముడిసరుకులు వగైరాల్లో వర్తకంగాని, గలవాళ్లని, — ఎందుకేనా ఎప్పటికేనా మంచిదని చెప్పి — శాస్త్ర చర్లని చూపు చూపి, తక్కినవాళ్ళమీద రూలు ప్రకారం కాగాలూ మిగియాలూ నూరడంలో కనపరిచే నిష్పక్షపాతబుద్ధికి ఈసభవారు ఆశ్చర్యపడకుండా కూచున్నారు —

తమ రైలుబైయుకి ఒకజాము ముందువెళ్ళి, దాన్ని గురించి తెపిస్తూ, ఇంకా అది ఎంతసేపటికి వస్తుందని — తమకు ఫలానా అప్పుడూ అని తెలిసుండీకుడా — కనుక్కుంటూ, కనుక్కోడంలో చివాట్లు తింటూ ప్రయాణాలు చేసేవాళ్ళకీ, రిస్టువాచీ చూసుగుంటూ అంచీలమీద ప్లేపన్లోపడి కటాకటీగా రైలుదాటు పెట్టుకునే వాళ్ళకీ, ఈసభవారు దణ్ణాలు పెట్టి, చెరిసహాం చొప్పున పై రెండు తరహాలవారూ ఆదర్శాలు పంచుకోవలసిందిగా కోరుతున్నారు. —

కుష్ఠులు, బధిరులు, పంగులు, అంధులు, భిక్షులు, — లాంటివాళ్ల అవస్థ దుర్భరంగనక, వాళ్ళు రైల్లో ముష్టెత్తుగోడానికి వాళ్ళని ఊరికే రైలెక్కనిచ్చి, తద్వారా యథాశక్తిదానం చేసుగుంటూ పుణ్యం ఆర్జించుకోడానికి ప్రయాణీకులకి తరుణంయిచ్చి, మరొకళ్ళఖర్చుమీద రైల్వే మేష్టర్లు కనపరుస్తూండే దాక్షిణ్యానికి ఈసభవారు వారిని చాలా కీర్తిస్తున్నారు. —

టిక్కెట్లుకొనుక్కునేటప్పుడు: ఓపక్కనించి వెడితే ఆలస్యం

అవుతుందేమో, తనకి టిక్కెట్టు అందక తనను మిగిలి పోవలిసివస్తుందేమో, పెద్దగా కొనుక్కున్నవాడు ముందెళ్లి పోతాడేమో అనేబాధ చొప్పున అందరకే అక్కడ నిలబడి ఉన్నవాళ్ళని తోసుకుని, వాళ్లమీద తమచుట్ట ఉన్న అభిషేకించి తన 'టముకు' పెట్టె మొనతో వాళ్ళనిగుచ్చి, టిక్కెట్లి కిటికీమీదకి ఎగబడే ప్రయాణీకులు బతుకు తెరువు తెలిసిన వాళ్లు గనక, వారి అదృష్ట సౌఖ్యానికి ఈసభవారు, వారిని నెత్తిమీద పెట్టుకోవాలని చూస్తున్నారు. —

తమయిష్టం వచ్చినచోట తమను నిలబడి తమ ఎదురుగుండా ఏపెట్టె కనబడితే ఆ పెట్టెలోకే ఎక్కి, అందులో ఎంతమంది ఉన్నారనే వాళ్ళని 'తప్పదు గనక సర్దుకోవాలి' అంటూ, 'ఎంతసేపు - కొంచెం' అంటూ వాళ్ళకి వేదాంతం బోధిచుతూ బాధించుతూ ఉండే జ్ఞానులకి ఈసభవారు వందనాలు అర్పిస్తున్నారు. —

"టిక్కట్టు" అంటే రైల్వేకంపెనీవారు అది కొనుక్కున్న వాడి శరీరాన్ని - దైవకృప ఉంటే - దానిమీద రాసిఉన్న ఊరికి తీసికెళ్ళి వదిలిపెడతాం అని టిక్కట్టు కొనుక్కున్న వాడితో పడ్డ పూచీమాటలుగల అట్టముక్క అనేసంగతి గమనించక, టిక్కట్టు అంటే తాము తమకు కూచున్న వాడి మీద చలాయించడానికి పైనైన అధికారానికి చిహ్నమని భ్రమించి వింతరకపు జంతువులుగా తయారయ్యే ఘనుల్ని చూసి ఈసభవారు హడిలిపోతున్నారు. —

ఖాళీగా ఉన్నపెట్టె వెతికి తనూ తన సామానూ అందులో పడేసుకుంటోటీ ఫెడీమని తలుపువేసి, ఆ కాల ఎక్కబోయేవాళ్ళ వేళ్లు పచ్చడైనాసరే చూడక, 'ఖాళీ లేదు పక్క పెట్టెలోకి వెళ్ళండి' అనే మాదిరి అమూల్యమైన సలహాలు ఇచ్చే మహానుభావుల్ని తగినంత మెచ్చలేక ఈ సభవారు రాకెత్తిపోతున్నారు. —

డబ్బోసి టిక్కెట్టు కొనుక్కున్న జనం, ఒక్కొక్క పెట్టెలో, నియమితసంఖ్య దాటింగి, — ఎవర్ని ఏమి నడగాలో నోరులేక అడగగలిగినా పని కొందరవల్ల తీరికలేక — పశువులా పేకాలాగ నిలబడి ఉన్నా, అందులోకే, లోగడ ఆర్జించిన సొమ్ము వడ్డీకేసుకుని కష్టో గుడ్డో నూ కలిగిఉండడం వల్ల రాం కీర్తనలూ వేదాంతమో పాడుకుంటూ, పెట్టెల్లోకి జొరబడి, నలుగురి ఎదుటా దమ్మిడీయో రోలియో దానంచేసి కొంతవరకు దానకర్త అని పేరు పొందాలనుకునే ఉత్సాహుల్ని హృదయం కరిగించే మాటలు చెబుతూ, ఈ లోపుగా తమరి శరీరానికిగల వ్యాధీ, కుష్ఠూ, ధూళీ, మురికీ ఈ మూలనుంచి ఆ మూలకి కూచునే జనానికి రుద్ది, వ్యవహరించే భిక్షువాళ్లనన్నీ, కంపెనీల వెల్లడిచిత్రం చౌకగా సాంపిల్ ముందులు అమ్మడానికి ఉపన్యసించే ఏజెంట్లనన్నీ, ఏమూలనుంచో వచ్చి మేజక్‌లు చేసేవాళ్ళనన్నీ, ముంటిగొంతుకతో పాడి గరంవాలే పాటలపుస్తకం అమ్మవాళ్లనన్నీ, వస్తువులు అమ్మేవాళ్ళనన్నీ, మాపాయిఖరీదు చెప్పి చివరకి అయిదుకాన్లకి

యివ్వకుండా, చదువుతూండే ధనికులయొక్క ఘనత్వం, ధన్యత్వం, సరసత్వం గురించి ఈసభవారు బెంగెట్టుగుపోయి హాహోరున, ఆనందిస్తున్నారు. –

గంటలకి గంటలు ప్రయాణం ఉన్నా, ఏమీ చెయ్యకుండా కిటికీకి దగ్గిర స్థలం సంపాదించుకుని, తను తాలూకు సామాను పైన పెట్టుకుని, బయటికి చూస్తూ కిమ్మనకుండా గడిపే ఆలోచన పరుల్ని ఈసభవారు హెచ్చరిస్తున్నారు. –

సూటుకేసులు, పరుపులు, పీటలు వగైరాలు కిటికీల్లోంచి లోపలికి గిరవాటేసి రైలు ఇక వదలబోతోంది అన్నప్పుడు ఎక్కి, అదివరకే కష్టపడి లోపల కూచున్న వీళ్ళందరికి ముసుసులు పెరగ్గొట్టవాళ్ళ అహింసాభావానికిన్నీ, వేగానికిన్నీ ఈసభవారు వారిని మర్యాద చేస్తున్నారు. –

సిద్ధర, జబ్బు, నోరు, జబర్‌దస్తీ, బిచాణావగైరాలు ఉపయోగించి నియమితస్థలం తమరు ఆక్రమించుకుని, అదే తను ఆధిక్యత అని గర్వించే మహాత్తరుల్ని ఈసభవారు ఆరాధిస్తున్నారు. –

పరాయివాడిచేత కిరాయిపెట్టించిగాని, బల్ల కింద దూరిగాని, పాకీదొడ్లో నక్కిగాని, సమయానికి అవతలవేపు దిగిగాని, ఇతరత్రా దగాచేసిగాని, సన్యాసులైగాని, కావలసినవారైగాని, సేవకులైగాని, నెత్తిమీద వాళ్ళైగాని, తత్సంబంధం కలవారైగాని, ఎల్లాగో అల్లాగ టికెట్టు స్వంతంగా కొనకుండా ఉచితప్రయాణంచేసే అదృష్టవంతుల్ని

ఈసభవారు ప్రశ్నార్థం పడుతున్నారు. —

అతిజవంతో రైలు పోతూన్నప్పుడు అందులో కూచుని బయటికి చూస్తే దగ్గరవని మనం అనుకునే వస్తువులు మన్ని విడిచిపెట్టి దూరంకావడమున్నా, దూరానివే మన కూడా రావడమున్నా ప్రతి నిత్యమూ గమనిస్తూండే కూడా, ఆప్రత్యయంగానే బహుమహాలిన్ని ఈసభవారు ఊరేగించి గౌరవిస్తున్నారు. —

తను ఎంతో వేగంతో పోతున్నా ననుకుంటూ, రాత్రప్పుడు, నక్షత్రాల కేసి చూస్తే తనూ, తన వాహనం, తన లోకం - వీటి ఉనికీ ఘూర్ణంపూ మాకేం తెలుసును అన్నట్లు ఆ నక్షత్రాలు నిర్నిమిత్తంగా ప్రకాశిస్తూండడం గమనించి మానవుణ్ణి అల్పుడుగా కట్టవార్ని ఈ సభవారు నిరసిస్తున్నారు —

శాంతంగా ఆలోచిస్తే రైలుప్రయాణం అనేది చిన్న ప్రమాణంలో జీవితప్రయాణం లాంటిదే అనిన్నీ, మానవ స్వభావాలు బయటపెట్టడానికి మానవుణ్ణి తయారు చెయ్యడానికి, అది చాలుననిన్నీ అనేవారిభావం శుద్ధపేలవం అయినప్పటికీ వారు అట్లాంటివి ప్రకటింప సాహసించినందుకు ఈసభవారు వారిమీద కొంచెం కోపం దాల్చడానికి ముహూర్తం వెతుకుతున్నారు. —

—

# తిండివిశేషాలు

[12 - 11 - 1939 తేదీని రాజమండ్రీమట్టుపల్లి ఒక వనంలో సంతర్పణ జరిగింది. ఆ తేదీనే చాలా జరిగేఉంటాయి గాని, వాటిల్లో ఇది ఒకటి. అందునిమిత్తం గ్రామాంతరాల్నించి సాధ్యమైన అంత్రాఉద్యోగులు విరివిగా రావడానికి ఏర్పాటు కాకుండా, అక్కడనే చాలామంది రావడం కూడా జరిగింది. గొప్ప అవసరం ఏమిటంటే, సంతర్పణానంతరం — పోనీ, సంతర్పణకి తప్పనిసరి ఫలితంగా ఉండే క్షుద్రనిద్రానంతరం, అనగా మూడు గంటలికి ప్రారంభించి — ఒక మూకప్రదర్శనంకూడా జరుగుతుందని కరపత్రాలు అచ్చుపడ్డాయి. అధ్యక్షులు ఫలానా, వక్తలు ఫలానాఅంటూ కార్యక్రమం వాటిల్లో ఉంది. లోగడ కార్యదర్శిగారు నన్ను గౌరవించి ఆసందర్భంలో నన్ను ఒక వక్తగా ఉండకోరారు. నేను ఆయనకి విధాయకుణ్ణి అవడంచేత "కాదు' అననూ లేక, అయినా వెంటనే ఒప్పుకోనూ ఒప్పుకోక, "ఎంత చదువుకున్నవాళ్లయినా ఎంత 'అర్థం' చేసుకోగలవాళ్లయినా, ఉదాత్తంగా భోజనంచేసిన తక్షణం ఏ ఫలాహారంఅంటేదో పుచ్చుకోగల్రుగాని, ఉపన్యాసాల వంటివి బొత్తిగా స్వీకరించలేరేమో, ఆరకం పదార్థాలు ఆసమయంలో ఓపమించవచ్చునుమండీ!" అంటూ నసగడం మొదలెట్టినా, ఆయన తన ఉత్సాహంలో "వల్లకాదు, మీరు ఒప్పుగునితీరాలి!" అని, నాచేత "సరే లెండి" అనిపించి, వక్తల జాబితాలో నన్నుకూడా అచ్చుకొట్టేశారు.

అక్కణ్ణించి, నేనూ కొంచెం బుగ్గగూలిపి, పేల్చడానికి వీలైన సామగ్రి కొంత సిద్ధం చెయ్యవలసొచ్చింది. మరో విషయం మరోవిషయం అయితేఅప్పట్లో మరీవిరిటించి పోతుందేమో అని భయం పట్టుకోవడంవల్ల, జ్వరం అందరూ అంతకి పూర్వమే ఆచరణావల్ల గ్రహించిఉంటారుగనక భోజనప్రమే యమే ఎత్తుగుడి కొన్ని సంగతులు పద్ధించుదాం అనీన్నీ, ఏఘట్టంలో పదార్థం మిక్కుటంఅయిపోయి వెళ్ళిపోయేలా కనిపిస్తుందో అక్కడికి కొరకు ఆగిపోయి జీవక్షోభ కలగ కుండా జాగ్రత్త పడదాంఅనీన్నీ అయత్నం చేసుకున్నాను. అయితేం! మన ఆశయానా! సంతర్పణఅయింది, రిమార్కులు అయినాయి, నిక్కచ్చిగా దంతపుపని చేసినవాళ్ల అపోహాలు అయినాయి, ఇటూ అటూ దొర్లుతూ కునుకులాగడాలు అయినాయి, కొంచెం గాబా జానా అయింది, ఎల్లాన్లో తంటాలు పడి, దాని మొహం ఈడ్చి, సాయంత్రం అయిదుగంటలు కూడా అయింది. తక్షణం కొందరు బ్యాంకుఉద్యోగులు, "కొంపతవ్వే కరపత్రాల్లో నిరూపించి ఉన్న ప్రకారం, ఆలస్యం అయితే అయిందని, మీటింగూ దానితాలూకు ఉపన్యా సాలూకూడా ఎక్కడగ్రస్తాగోకదా, ఇవన్నీ భరించడం ఎల్లాగా భగవంతుడా!" అని చెప్పి క్రొత్తగున్నట్టు బిక్క మొహాలు వేశారు. దా[illegible] ముఖ్యస్నేహితులు చూశారు, "మరి ఆలస్యం చెయ్యక మీటింగు కానిత్తాం, పిల్లలు సద్దండి" అనే సంగతి చకచకా నిష్కర్షగా మంచినీళ్ల ప్రవాహంగా

ఆంగ్లంలో అనేశాడు "సభంతపనీ జరిగిపోయిం దన్నమా టీరా దేవుడా" అని కొందరు ఉద్యోగులు నిస్పృహాలో పడిపోయారు. ఏవాడు చేసుకున్నదో మరి అనుభవించాలి గావును అనుకోడంవల్ల గావును, కొందరికి మొఖాన్ని కత్తి వాటువేస్తే నెత్తురురేదు కాని కొందరు గడసర్లు ధైర్యం అవలంబించారు "అబ్బెట్టు, ఫోటో తీయించుకోవాలి గావునుగా! అదిచాలా సుఖం వెలుగుండగానే ఇల్లుచక్కబెట్టుకోమన్నాడు ఓటో చిక్కబెట్టుకోమన్నాడు. ముందు ఫోటోయే! తరవాత తతిమ్మాది" అని మాట్లాడుతూనే, వాళ్లు, బల్లలూ, కుర్చీలూ అవీ ఉన్నచోటినుంచి ఓ ఫర్లాంగు దూరం ఈడ్చేశారు సూర్యాస్తమయందాకా వాళ్లు నిమ్మనిమ్మళంగా ఫోటోగ్రాఫు రేగుతూనే ఉండిపోయారు. మెట్టుకి ఒక్కడూ వక్తలున్నవైపైనా రాలేదు. కార్యదర్శిగారు చాలా నొచ్చుకుని, వక్తల్ని క్షమాపణ కోరుకున్నారు. వానప్రస్థంరోజునే ఉపన్యాససన్యాసం కూడా సిద్ధించి శ్రమ లేకుండా రెండాశ్రమాలు లభించడం జన్మకి చాలుగదా అని వక్తలన్నారు. కార్యదర్శి ఆ ఫోటోగ్రాఫు చెట్టుదగ్గిరికి మళ్లీ వెళ్లి చూసొచ్చి, కొందరు కుర్చీలకి అంటిల్లా అయిపోయారనిన్నీ, కొందరు మౌనవ్రతంలో పడ్డట్టు చెప్పారనిన్నీ, తక్కినవాళ్లు పంచబంగాళం అయిపోయారనిన్నీ చెప్పారు. "అమ్మా! ఇప్పుడొచ్చిన ప్రమాదంఏమీలేదు. శూన్యోపన్యాసాలకే, అర్థం చేసుకోగలవాళ్లు కూడా హడిలిపోవడం

వేళావిశేషం! మీరుచేసింది పదార్థాలసంతర్పణ, మాది పదాల సంతర్పణ అదీ ఇప్పుడు కేవలం తర్పణ అయిపోయింది మాపదాలు మేం నోటితోనూ అనచ్చు, లేకపోతే ఆనోట మొలగిలికూడా తగలనీయకుండా, పత్రాలమీదకూడా పెట్టచ్చు. అల్లానే కానిస్తాను అసలు నేచెప్పదలిచిన దాన్లో కొన్ని లెఖ్ఖలూ, అంకెలూ వచ్చే ల్లు ఉండడంవల్ల అది లిఖితంచేసుగునే వచ్చాను, రచనకి కారకులుగనక మీకు ప్రత్యక్ష నమస్కారం వద్దుమొర్రో అంటూ ఉన్న తమ సమక్షంలో చదవటానికుండా తప్పిపోడం అనే ఘన్యాం నా రచనకి పుట్టగానే కట్టబెట్టిన తక్కినవారికందరికీ లోపాయి కారీగా నమస్కారం. సెలవు'' అని నేనన్నాను. అయి పోయింది. నిష్క్రమించి మేం వచ్చేశాం రచన అల్లానే ఉండేసింది

ఇంతలో 17 – 2 – 1940 తేదీని రాజమండ్రి ఆర్ట్సుకాలేజీ పూర్వవిద్యార్థి వార్షికోత్సవం తాలూకు సమావేశం వచ్చింది. నేను అక్కడ పూర్వవిద్యార్థినై ఉండడంవల్లా, ఆంధ్రదేశపు విద్యాధిక సమావేశాల్లో ఆ సందర్భపు సమావేశం ఒకటి అవడంవల్లా, విద్యాసక్తగల స్త్రీ బాల వృద్ధులతో నిండిన సభ మొదట నిలబడి ముఖాముఖిగా మాట్లాడవలసిన అవసరం వచ్చినప్పుడు వక్త గమనింపవలసిన సార్వజనీనతా, మార్దవం, వైవిధ్యం, మోతాదూ గురించి అనేకంగా నేను నేర్చు గోడానికి అదే తరుణం అవడంవల్లా, ఆ సందర్భపు ప్రణాళికలో

నేనూ పడ్డాను కాని, ఆరోజున ఇతరవిషయాల్లో చాలా ముఖ్యమైనవి ఉండడంచేత, నాకు ఇచ్చిన వ్యవధి చాలక, నాకు కొంచెం — అసలు చాలా — ఉక్కిరిబిక్కిరి అయింది. ఏదేనా సమగ్రంగా చెప్పడానికీ వీలులేకుండా, పోనీ మానడానికీ వీలులేకుండా వచ్చింది. నేను సరాసరా ఉపోద్ఘాతం కానివ్వగుని, "అబద్ధం ఆడడం" గురించి ఒక పరిచ్ఛేదం చదివి, విషయం మారుస్తున్నా నని చెప్పి, ఈక్రిందరచనలో తిండిపోటిలున్న ఘట్టంలో కొంతమాత్రం తిరగేశాను. ఆవాక్యాలలో పేర్లూ, స్థలాలూ, అంకెలూ, లెఖ్ఖలూ, తేదీలూ ఉంటూండడంచేత వాటి యాథార్థ్యం నేను నమ్మి చదివాను. కాని, వాటిల్లో, చెప్పులుతినడపు పందెంసంగతి నేను చదువుతూన్నక్షణంలో, చీమకేనా సందులేకుండా ఉన్న ఆ మహాసభలోంచి ఒక పురుషుడు (— శ్రీ శ్రీ సర్ కె వి. రెడ్డి నాయుడుగారు అధ్యక్షత వహించిన అంత సభలో ఉన్న అంతమందినీ నేను అసత్యాలు చెప్పి మోసగిస్తూన్నసంగతి తను ఒఖ్ఖడే హఠాత్తుగా పరిశోధించినట్టు — నేను అబద్ధం ఆడడం గురించి అంతకీపూర్వమే ముచ్చటించిఉన్న వాణ్ణవడంచేత ఆతరవాత నేను ప్రసంగించేది ప్రతీదీ మంచి అబద్ధం అయి ఉండకపోతుందా అనే అఖండానుమానం తన్ని పీడించుతూన్నట్టు —) లోకకల్యాణం నిమిత్తం నావాక్యం కేవలం కోత అని బుజువుచెయ్యడానికట, "కొంగ్ కొంయ్" అనే శంకారావం చేసి, తను రెండు కోతలు కోశాడు.

నావి ఆత్మస్తుతిగల వాక్యాలైఉంటే వాటిని రెండు కాదు మూడుకోతల దువ్వెన్నలాగి కొయ్యొచ్చు. కాని, స్థితి వేరు! వారు అవస్థావశంచేత గొతమీనాన్నానం నిమిత్తం రాజమండ్రీ వేంచేసిన తైర్థికులై ఉండవచ్చునని నా రాజమండ్రీత్వానికి తోచి, నేను ఆధ్వని వచ్చినవేళ తిరిగి, "అయ్యా! నావాక్యాలకి లిఖితమైన సమ్మతిగ్గ ప్రమాణా నాదగ్గిర ఉందండీ! ప్రస్తుతం క్షమించండి" అనేసి, అప్పట్లో వ్యాసధిలేని స్థితిలో ఉండడంవల్ల ఊరుకున్నాను. కాని, ఇప్పుడేనా సప్రమాణంగా ఉంటే ఆనాటి మహాసభకి హాజరైఉండి ఆవేళ కమామీషు జ్ఞాపకంఉండి, ఈ రచనచూడ తటస్థించే రాజమండ్రీవాళ్ళైనా నన్ను శంకించకుండా ఉంటారుగదా అనే ధైర్యంచొప్పున అటువంటి వాక్యాలచివర జగత్ప్రసిద్ధిగల ఒకానొక వారపత్రిక యొక్క సంచిక నెంబరూ, మరి దానితరవాత ఆ సంచికలో ఆయా పోటీసంగతి అచ్చుపడ్డ పేజీ సంఖ్యా ఇచ్చాను. అన్నివేల సంచికలు కోతలతో భూమిమీద చెలరేగడం కష్టం. అయినా సరే, ఆపత్రికమాత్రం కొండమీంచి ఊడిపడిందా అంటే, మరి నమస్కారం!! పేర్లూ, అంకెలూ, లెఖ్ఖలూ ఉన్నాయిగా! హృదయం, బుర్రా, ఓపికా, పట్టుదలా ఉంటే ఋజువుచేసి చూసుగోడానికి వీలున్న సంగతులుకూడా చెవికి ఇల్లా తగిలాయోలేదో ఆపళంగా కొయ్‌కొయ్ మని గర్జించి తెయ్ తెయ్ మని ఆడేసేకంటె, తణిఖీచేసి యథార్థం తేల్చుగునేదాకానేనా ఆగడం ధర్మం. విద్యావంతుడు వినగానే తను

